# ఆదిశక్తి - అమ్మోరు - పురాణం





ప్రచురణ

**యు.కె. బుక్ డిస్ట్రిబ్యూటర్స్**

ప్రశాంతినగర్, Opp.శివాలయం

**పెందుర్తి** - 531173.

విశాఖపట్టణం

(A.P.)

# ఆదిశక్తి - అమ్మోరు - పురాణం

**(AADISAKTHI-AMMORU-PURANAM)**

*Written by*

Prajakavi-Vanagapandu- Applala Swamy
Retd. Principal

***Correspondent***

T.S.R. National Junior College, Pendurthi

Visakhapatnam- Phone - 767594 (A.P.)

ప్రచురణ : **2002**

ప్రతుల సంఖ్య : **1000**



ప్రతులకు వ్రాయండి

మెనేజర్

U.K. బుక్ డిస్ట్రిబ్యూటర్స్

ప్లాట్‌నెం. 9-67, ప్రశాంతినగర్

శివాలయం- పెందుర్తి - 531173

విశాఖపట్నం (A.P.)

మూల్యం : 20/-

# ఆదిశక్తి - అమ్మోరు - పురాణం

శ్రీకరము - శుభప్రదమగు సృష్టికెల్ల
ఆదిశక్తి, పరాశక్తి, అంబ - ఆదిమాత.
అమ్మలను గన్నయమ్మ, మనమ్మోరుతల్లి
పూజచేయగ - పఠింతు - పురాణ మిదియె.

పుణ్యప్రదము పురాణము, పురాతనమిది
పుణ్యపురుషుల ప్రవచన జన్మఫలము
పుణ్య, ఫలసిద్ధి- జన్మల- పూర్వ గుణము
పుణ్యవచనమె- విన జీవి - పుణ్యమండ్రు

పూర్వకథతెల్పునిది యొక పురాణమవదు.
ఇహపరాల రెండింటిని కూడ విప్పిజెప్పి
జన్మకో సార్ధకత నిచ్చు సాధనమన
పూర్వకథను తెలుపనది-పురాణమగును.

"వేదము" త్రయీ ధర్మమని ఎత్తి జూప
భారతం పంచమ వేదము ప్రసిద్ధినందె
"గీత" భారతమునందలి - వ్రాతకదర
వేద విదుడు-వ్యాసుని విరచితమిది

ఉర్వి వెలసిన పురాణాల సృష్టికర్త.
వేదవ్యాసుడె భువికెల్ల వెలుగునిడెను.
కాశికాపుర నివాసిగ ఖ్యాతి గాంచ,
జరిగె నొకనాడు – సంఘటన జగతికొరకె.

భరత రాజవంశానికి భాగ్యదాత
వేదవిదుడని హర్షించిరెల్ల ఋషులు.
వ్యాసుడే నారాయణుడని వాసిగాంచె,
పురుష త్రయమును వివరించె పూజ్యుడితడె.

ఆశ్రమనివాసియై వారణాసిలోన,
విద్యనార్జించు శిష్యగణం వెంటనడువ
భిక్షగొన కాశికాపురివీధిలోన
బయలు దేరెను ఒకనాడు వ్యాసుడంత

పుణ్యసతులు భిక్షము పెట్టజోలిపట్టె
గురువు వ్యాసుడు ముందున తరలివెళ్లె
శిష్య, గణము కాశిలొ భిక్ష స్వీకరించ
ధనమదాంధుల నర్థించ నరుగలేదు

ఎన్నివీధులు తిరిగిన ఏగృహిణి కూడ
చేర రమ్మని భిక్షము వేయలేదు
వ్యాసుడంతటివానికీ దురవస్థతగున?
కాని, రోజులేరా "విధి" కైన తప్పదు కద.

రాజలెల్లరు పాదపూజకు వత్తురుకద
ధర్మవేత్తలు, ధర్మమును నేర్తురుకద
శిష్టజనులెల్ల తననే పూజింతురుకద.
వ్యాసునికి భిక్ష పెట్టగ రారే ఎవరు!

వ్యాసుడానాడు తనశిష్యగణము తోడ,
ఇంటి, ఇంటికేగి గృహిణిని - భిక్షమడిగె
భవితీ, భిక్షాందేహియని - మారు మ్రోగ
ప్రతి గృహిణిలేదు, పొమ్మనె-మాటచెప్పె

భారతము-భాగవత పురాణాల గ్రంధకర్త
శాంత శృంగార రసాల సృష్టికర్త
వేద ధర్మానికే యొక వెన్ను దన్ను
వేద వ్యాసుని ఓర్మి నశించెనంత.

వ్యాస భగవానుడుగ్రుడై అలుకజెంది
నగర నడివీధి మధ్యనునడచి నడచి
వేద ఋషికి భిక్ష పెట్టనిదేమి కాశి!
కాశికాపురినె శపించ దలచినాడు.

చేతిలోగల కమండలం ఎత్తివంచి,
మంత్రజలమును హస్తాన జారవిడచి,
కాశికాపురినే శపించు వ్యాసమునికి,
పిలిచెనొక ఇల్లాలు రమ్మని పిలుపునిడుతు.

భిక్షనిడదును రమ్ము మా యింటి కనుచు
పిలుపు వినబడ వ్యాసుడు కలత వీడి
ఇంటి దరి జేరి, భిక్ష నర్థించెనంత.
నగుచు గృహపత్ని వ్యాసునితో ననియెనిట్లు

సత్త్వగుణకర్మ సంజనిత బ్రాహ్మణుండ
రాజ,సిక తామ, సికునిలా పలుకతగున
జాతి,నాశీర్వదించెడి, జాతి,నీది
పూట, కూటికి - శపింతువా! లోటుకాదె.

అనగ విని వ్యాసుడంబతో పలికెనిట్లు
కాశికాపురి అన్నపూర్ణమ్మ కనికరించి
ఇచ్చెదవతల్లి ఆతిధ్యమీవునేడు
బిక్షు, నిడుదువ మాటలా! చెప్పుతల్లీ!

ఎక్కడిది సాధ్యము శిష్యులు వేయిమంది
ఇందరికి భిక్షనిడుశక్తి నీకుంద తల్లీ!
అమ్మవై అన్నపూర్ణమ్మవైమమ్మాదరించ
వచ్చెదము పోయి శుచిగ మడిగట్టుకొనుచు.

పలికితివికద-నన్ను నోట నన్నపూర్ణనుచు
బ్రాహ్మణుడు- భోజన ప్రియుడు- బాగ తెలుసు
చక్రపొంగలి- దద్దోజనం- పులిహోర మిడుదు.
వేగమేరండు- భోజనం- పెడుదునెను.

అంబపలకుతో వేదకర్త హర్షమంది,
గంగలో స్నానమాడి- శిష్యగణముతోడ,
అన్నపూర్ణ ఇంటి కరుదెంచె- ఆతిధ్యమొంద.
అమ్మవడ్డించతిని రన్నం-"పరబ్రహ్మ" మనుచు.

చిటికలో షడ్రసాలను చేర్చికూర్చి
వేయిమందికి భోజనం పెట్టగలర?
దివ్యదృష్టిని వ్యాసుడు తెలుసుకొనెను
స్వామి, ఈశ్వర సతియామె అన్నపూర్ణె

ఈమె ఎవరు! సాక్షాత్ ఈశ్వరుని సతి.
విశ్వనాధుని ధర్మపత్ని ఇల్లాలు ఈమె!
ఎల్లరికి తల్లి కడుపార తిండిపెట్టి
కుశలమడిగెను వ్యాసుని "కూర్మి" దోప

అంత ఇంటిగల, శివదేవుడటకురాగ,
ఈశ్వరుని జూఛి భక్తితో, లేచి నిలచె
గరళ కంతుడు తీవ్రమగు స్వరమునను,
వ్యాసునింజూచి అక్కసుతో ననియెనిట్లు!

ఏమిరా వ్యాస నీ పొగరెంత ఎక్కువాయె!
వేధవిదుడనన్న గర్వము వీడలేదు.
బ్రహ్మజ్ఞానివి జూచితి వహంకార్వై
కాశి, కాపురికి, నాసతికి శాపమిడగ

"అన్నపూర్ణ" కాశికాపురి మరచినావ.
పట్టెడన్నమొకపూటెవరు పెట్టకున్న!
కాశికాపురిపైన కన్నెర్ర జేసినావు
కళ్లునెత్తి కెక్కె-పురాణాల కర్తవుకద!

ఇంకనీవిటనుండె య్యర్హత నీకు లేదు
వెంటనే పొమ్ము ఇటనుండి ఎచటకైన
కోపతాపాల్ని గలిగిన - తాపసికుడవు.
నిన్ను క్షమించటానికి వీలుపడదు.

వ్యాసునీరీతి గర్జించి శంకరుడు వెడలె
అన్నపూర్ణమ్మ భర్తకెదురాడలేదు!
వ్యాసుడును శివుని ఆజ్ఞకు నాశ్చర్య పడతు
కనులలో భాష్పధారలు - కదలు చుండె

"అమ్మ" అన్నపూర్ణమ్మ ఓదార్చె వ్యాసునంత!
శివుని ఆజ్ఞను శిరసావహించ వ్యాస!
తండ్రి మాటను పాటించు తనయుడవన
తూలనాడకను వీడు మీ పురిని వేగ.

అనగ విని వ్యాసు-డంబతో ననియెనిట్లు
"ఆది దంపతులు" కద మీరె! అమ్మనాన్న
జనకు నాజ్ఞను ధిక్కరించెడి, జన్మదేల
పుడమి పశుతుల్యు డైనట్టి పుత్రుడేల.

అనగవిని అన్నపూర్ణమ్మ సంతసించి,
వ్యాస! వెడలి వెళ్ళు! దక్షిణాపధముజేరు.
అచటగల డగస్త్యుడేనీ, కాప్తుడగును.
"ఆర్యసంతతి" నీకచటహారతినిడు.

"ధర్మభూమి" ఆర్యవర్తమే-ధరణిలోన
పుణ్యప్రదమని-పురాణాలనుడివినాను
ఆర్యభూమిని విడనాడి-అరుగ గలన!
ఏమి చేయుదు-నింకనా కెవరు దిక్కు

అనగ వ్యాసుడు విని అంబ మారు పలికె.
వ్యాస చింతించకుమ లవవేశమైన
వేదఋుషులు అడుగిడు ప్రదేశమెల్ల
పుణ్యతీర్థమె అగుగాక పుడమిలోన.

వింధ్యనే దాటియగస్త్యుడు - దక్షిణము చేరె
నీవు ఆమార్గమును మార్చి వేరు దారి
మలయ పర్వతము మాటున నడచి నడచి
ఘన కళింగను తాకుచు - తరల వలయు.

అంగ వంగ ఉత్కళ కళింగ రాజ్యాల దాటి
చేరుకొనుము దక్షిణాపథం- క్షేమముగను.
కళింగలో గల ముఖలింగం "కాశి" మరియు
మూడు నదులు "సంగమమును" చూడగలవు.

కూర్మ వరాహ - నృశింహపురాణాల
విష్ణుదేవుని అవతారాలు- విశదపడును
మూడు అవతార మూర్తుల "నాడు" కదర
నీ పురాణ మూర్తుల దర్శనం నీకు గల్గు

స్వార్థపరులు స్వప్రయోజన దారినేగి
పావనంబైన కళింగన పవిత్రమనిరి
జ్ఞానులడుగిడ స్థలము పవిత్రమగును
కాలిడుము, కళింగాంధ్రకు-కాంతినిడగ.

అన్నపూర్ణమ్మ ఈరీతి నాజ్ఞనిడగ
వ్యాసుడానాడు దక్షిణకు-బయలుదేరె.
అన్నపూర్ణమ్మకు భక్తితో వందనమిడి
కాశికాపురినె వీడచు - కదలె చనియె.

అతిధిగ నగస్త్యు నింటను నాగదలచి.
దక్షిణాపధము జేరగ-నరుగుచుండె
తొల్లి యగుస్త్యుడు-త్రొక్కిన దారిగాక
అంగ-వంగ-ఉత్కళను-దాటి కళింగ-జేరె.

గంగయమునకు సరిపోవు పుణ్యనదులు
త్రిలింగలోగలవు-కళింగలో లేవు అనెడి
అపప్రధ పోవగ వ్యాసుడు-కళింగలోని
వంశధార, నాగావళీ నదీ స్నానమాచరించె.

పరమపావనుడు - వ్యాసుడు - కాలుమోప
"బహిష్కృత-కళింగ" - అపప్రద బాసిపోయె
వేదవ్యాసుడు-బోధకుడు-వేల్పుబిడ్డ
కారణ జన్ముడు కళింగలో కాలుపెట్ట.

దివ్యదృష్టితో దారులు తెలియబడగ
ఉత్కళము దాటి మహేంద్ర ప్రక్కజేరి
దుర్గమారణ్య పర్వత గుహలుదాటి
శిష్యగణముతో- వ్యాసుడిటకు చేరె.

సాగరం దరిని శిష్యగణం సంబరపడె
తీర మందున-వెలసిన- కూర్మనాథ
చిన్నగుడి తప్ప గోపురమేకానరాని
కూర్మనాథుని వ్యాసుడు- గొలిచినాడు

మెడలో రుద్రాక్షమాల నుదుట నెర్ర బొట్టు
పంచకట్టు వస్త్ర మొల్లని వారి వొళ్ళు
సిగముడి చేతక మండలం గడ్డములతొ
వేయి మంది శిష్యులు తన వెంటనడచె.

దివికి భువినుండి విచ్చేసిని దేవతలని
భూమిపై నడుచు దేవతా భూసురులని
నాటికళింగ ప్రజవీరిని- కనులార గాంచి
స్వాగతాంజలి- ఘటించె- సాష్టాంగ పడుతు.

ఆది కూర్మావతారునికి - భక్తి మ్రొక్కి
దివ్యముఖలింగ దేవుని దర్శించనెంచి,
పయన మవుతు వ్యాసుడు దారినడిచె,
శిష్యులను జూచి వారికి తెలియబలికె.

కాలిడితిమిట-కళింగలో - కాంచినార
మూడు అవతార మూర్తులు పుణ్యభూమి
పృధ్వీ-కూర్మ-వరాహ-నృసింహులనగ
ఆది అవతార మూర్తులకాది భూమి.

విష్ణువు దశావతారాల నెత్తెననుచు
దెలిపితిని భాగవతమున తెల్లముగను
ద్వాపర యుగాంతమువ కధ ఆగిననగ,
కలియుగ ప్రభావమును గూర్చి కలత పడితి.

పుణ్యకళింగ భూమిది పురాణభూమి
ఆది విరాట స్వరూపుని అవతారసీమ,
ఈశ్వరుడు నవతారమూర్తిగ వెలసెనిచట
అదిగో చూడుడు-ముఖలింగం-మెదురుపడెను.

భక్తితో మ్రొక్కులిడె-దైవదర్శనం-బొనర్చి
కోటిపుణ్యాల ఫలమది కూడిరాగ
రండు ముఖలింగేశ్వరుని కనుల చూడ
ఇహపరాలకు - తోడు - ముఖలింగముకద

వ్యాసుడును-తన శిష్యగణం-భక్తితోడ,
ఆలయం జేరి పూజించె నమిత భక్తి,
కోటికొక లింగము లేదను కొరత బాసె
కళింగకాశి-ముఖలింగం-కాంతినిచ్చె.

శ్రీముఖలింగమును దర్శించి సేవజేసి
వ్యాస డానాడు త్రిలింగకు పయనమయ్యె
మార్గ మధ్యాన కళింగాంధ్ర-గడ్డపైన
ఆగె నారాత్రి నిట విశ్రాంతి కొరకు

కంటికి నిద్రరాకొకచోట ఒంటరిగను
కూర్చొన, కలత లోలోన గుమ్మరించ
మానసిక వేదనతొ నెంతో బాధపడగ
అంబ ప్రత్యక్షమయ్యె వ్యాసుడాశ్చర్యపడగ

ఆదిశక్తి-పరాశక్తి- అమ్మ- ప్రత్యక్షమవగ
భయమునను లేచి - భక్తితో-సాష్టాంగపడెను,
ఏమినాభాగ్యమేతల్లి- అరుదెంచితివికద
అభయ, హస్త మొసగి నన్నాదు కొనుము.

ఏమి తనయ! వ్యాసా! నీదిగులేమి చెప్పుమీ!
దీన, వదనుడవై మనోవేదన పడి
దిగులుతో కూర్చొనగ జూచి దిశను జూప
వచ్చితిని కద- దిగులు పడకు బిడ్డ.

అంబవు-పరాశక్తివి-నన్నునుగ్రహించు
వేదములనెల్ల శోధించి వెదకి పట్టి
తెల్పితిని- భారతం-పంచమ వేదమనగ,
ఎన్నో, తెలిసిన, మనో వేద, నేల తల్లి!

ఆదిశక్తి- అమ్మోరు-వ్యాసుని మాటలువిని
నగుచు బలికె వ్యాసునితో అంబ ఇట్లు
మనసు, చంచలమస్థిరంబలమైనదనుచు
పలికితివికద, "గీత" లో మరచినావ.

ఋషివి-కవివి-మనోవేదన - ఏలకలిగె
మనిషి-సుఖ దుఃఖ సముచ్ఛయం-"కర్మ" లేకద!
సరిగ లేకున్న - "కర్మయే" దుఃఖకారణమగు.
వేద ఋషివి-సత్కర్మను- వీడితివదేమి!

ముప్పురమ్మలే జగతికి మూలమనుచు!
అమ్మలనుగన్నయమ్మను మరిచినావు.
దేవ, దేవుని పురాణాలెన్నో వ్రాసినావు.
ఆదిశక్తిని, అమ్మోరికి-పురాణమేది!

ఆదిశక్తి వినా జగతికి ఆయువేది.
ఆదిమానవుడు పలికె నన్నంబయనగ.
వేదమానవుడవంబను విస్మరించి
"అమ్మ" అనుచునా అంశాల్ని చాటినావు

పార్వతీ, - లక్ష్మి-సరస్వతిని- ప్రస్తుతించి
బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు- ప్రార్ధనలిడి.
జగతి, త్రిమూర్తులకు తగ్గ కథలు గలవు
లోకమాతను - నాకథకు-చోటేలేద!

"ఆది విష్ణు" వెయన్నింటి కొ వియనుచు
ఆదిమాతను, అమ్మోరును వదలినావు
ప్రకృతి మహాశక్తి మాత నేనాదిశక్తి
నన్నింటికి మూల కారణమౌ దునేనే.

ఆది పురుషుడె కర్తనె భాగవతము
వేద, పురుషుని- భారతం- తెలిపెనుకద.
సృష్టి మాతకు పురాణమొకటి లేదె.
అమ్మయే లేక పురుషుడెలా అవతరించు.

నాదు అంశాలు రూపాలు ప్రజలకొరకె,
భైరవి- మహాకాళి- కాత్యాయని- భగవతిని
పోలమాంబ- పైడిమాంబ- నూకాలమ్మలనగ-
కనక దుర్గనునే, నెకలకత్తా కాళి నేనే.

వేదకర్తవు- తెలియని- దేమిలేదు
సర్వమెరిగితి నన్నగర్వం- చెరుపు చేసె.
అమ్మలను గన్న అమ్మకు స్థానమేది
లక్ష్మి పార్వతీ - సరస్వతీకి! నాంది ఏది!

ఇచ్ఛ జ్ఞాన క్రియాశక్తి దేవ దేవి యనుచు
లక్ష్మి, పార్వతీ, సరస్వతిగ-పలికినావు
భావ, మది గొప్ప - సృష్టి ప్రదాయనిని కద.
పుడమి, నేలు అమ్మతల్లికి-పురాణమేది?

కర్మజేసితివి-ఫలమును, భవించు
నిత్యమానవ సంఘర్షణ నీతి జెప్ప
మానసిక శాంతి- నీకెలా పట్టువడును
మదిలో గల సంక్షోభము వదలదుకద.

ఎంత, గనొ చాటి, భాగవతం, కధనల్లినావు
ప్రజల, భక్తికి ముక్తికి దొక, శక్తి అనగ
కృష్ణ పూజకు - భక్తులు - హెచ్చులేదె
శక్తి పూజకు వచ్చె జనులు తగ్గలేదె.

అనగ విని వ్యాసుడంతట-నదరి బెదరి
ఏమి తల్లిది శాపమా! నేనేమి ఎరుగ!
తామరాకునగలనీటి చందాన నేను
వ్రాసితిని-పురాణాలను-వ్యాసమునిని

ఏపురాణము విప్పిన- వినిపించు నిలను
శాంభవీ మాత సర్వశక్తి ప్రదాత-శక్తిమాత
నిన్ను మరచితినను మాటనిజముకాదు
తల్లి నే మరువ బిడ్డకు మనుగడేది.

నిజమే వ్యాసముసీంద్రుడ వినుము నీవు
అన్ని గ్రంథాల్లో నను గూర్చి వ్రాసినావు
అమ్మకును పురాణ మనుచు వ్రాయలేదు
మూల శక్తిని పూజించక-ముక్తిరాదె.

మహిళ,నవమాన, పరచ, మహారాజులైన
పుడమి నశియించి నిలువున కూలు ననుచు
సీత-ద్రౌపది-నిరువురిని-నిలిపి-నీవు
భారతము-రామాయణాల్ని-పలికినావు

ధర్మయధర్మాల సంఘర్షణ అవనిలోన
తప్పదనె-భారతమది గొప్ప అగును
ఆడదిల సంఘర్షణ కారిణియని
కథలు నడిపితివామె యొక కారణమన

భక్తిపాలు హెచ్చువగనిల- భాగవతము
విష్ణులీలలన్వర్ణించితి-వెంతగానొ
సూత్రధారి - జగన్నాటక-పాత్రధారి
హరియనుచు-సర్వవిధాల-చాటినావు

భూమి- నీరు- అగ్ని యీ మూడు "దృశ్య జగతి"
గాలి ఆకసము రెండు యదృశ్యజగతి
దృశ్యజగతికి నిలచిన - "దేవత" యగు
ద్వివిధజగతుల కతీతము "దేవ దేవి".

ఉర్విలోనాకనేక-నామ రూపాలు గలవు
సర్వజగతికి - అమ్మను -నేనమ్మోరునౌదు
జీజక్షేత్రాలు- రెంటికి నతీత మేను
ఆదిశక్తిని "స్వజామ్యహామ్" నన్ను నేనె.

పుడమి త్రిమూర్తులు-కర్తలని-నుడివినావు
వేదము త్రియీ ధర్మమని తెలిపినావు
పురుష, కారక దైవమే పుడమి కనుచు
దేవ దేవిని నీవెచట నిలిపినావు

ఆది శక్తిని నేనన్నింటికి-నాదినౌదు
మూల శక్తిని నేనన్నింటికి మూల మౌదు
ప్రణవ శక్తినినే నన్నింటికి ప్రాణమౌదు
"ఓమ్" శక్తిని నేనెన్నటికి ఓంకారమౌదు

శ్రద్ధతో విను వ్యాస క్షేత్ర బీజాలు రెండు
మేళవించిన యీ సృష్టి ఏర్పడునిల.
ద్వివిధ శక్తులు నానుండి విపులమగును
ఆదిసృష్టికి యద్వితీయ శక్తి నేనె.

మూల దేవతను గొల్చనిదే ముక్తిరాదు
మూలపురుషుని నిల్పి ముందు వరుస.
భాగవతం మూల పురుషుని గాధ అగును
మూల, దేవతకు - పురాణ ముందవ్యాస.!

తల్లి "సత్యవతి" తరించ కధనల్లినావు
మూడు పురుషార్ధములని మూలమునగ.
తల్లులకు తల్లి అమ్మతల్లి తెలియదేమి.
లోకజననిని-నను దెల్పు పురాణమేది.

ఈశ్వరిని మహేశ్వరుని-వర్ణించినావు.
లక్ష్మినారాయణుల గొప్ప - చాటినావు
బ్రహ్మ సరస్వతులను గూర్చి - వ్రాసినావు
దేవ, దేవిపయి - గ్రంధములే, దేమి వ్యాస!

ఆదికవి కూడ- నీవలె- యాద మరచి
రామకధ- రావణ కధతో-సమాప్తమనెను
సీత-వాల్మీకి-ఆశ్రమం- చేరి తనకు
ఎల్లకష్టాల తీరొక వ్రతం -చెప్పమనియె.

ధరను వాల్మీకి-విష్ణ్వాంశ-జగతికెల్ల
దారి, దిక్కను-తెల్పుకధ-రాసినాడు
త్రోవగల్గ-సీత-కష్టాల పోవ నిలను
సలుపమనె కాత్యాయని-వ్రతమునాడు.

ఆదిశక్తిని, కాత్యాయని అనగ నేనె.
ధరను, లలితా సహస్ర నామ స్మరణవలన
సకల శుభములు నిచ్చెడి-శక్తి నేనె
ఎల్లజగతి-నిరక్షించు- తల్లి-నేనె

ధరను, త్రిమూర్తులె దైవాలని, దలచినావు
వారి, సతులే, ధరిత్రిని- రక్షించుమనగ.
నెల్లి పౌరాణిక- కథలలో తెలిపినావు
వేల్పుటమ్మను- న్నొచట నిలిపినావు.

ఆదిశక్తి వినాజగతి కాధారమేది
దేవదేవిని కొనియాడ మేలుకొనుము
వైదికమవైదికం సఖ్యపడిఐ- క్యపడగ
ఆర్య నార్య సంస్కృతిభావ్యమనగ.

అంబయీరీతి వ్యాసుని మందలించ
"అమ్మతల్లీ" క్షమించు నా అపరాధ మనుచు
నెల్లపురాణాలలో నిన్ను నిల్పితిని తప్ప
నీ పురాణమునే వ్రాయ లేక పోతి.

ఎంత దయగల తల్లివే ఎదుట నిలచి
తప్పు దిద్దుకొని తరించ చెప్పితివికద.
భక్తజనకోటి- మెచ్చగ- భాగవతము
తొల్లినే వ్రాసితి- భక్తులకు- ముక్తినిడగ

నేడు నీకథను వ్రాసి నిన్ను మెప్పించువాడ
ఆదిశక్తి- అమ్మోరు- పురాణమనుచు బలక
దేవ, దేవీ భాగవతముగ - తెలియబడగ
"భగవతీతత్త్వమె- పుడమికి పట్టువడగ!

రాసెదనుతల్లి- అమ్మోరు పురాణమనగ
నిన్ను మెప్పింతు- శుభముల - నిమ్ముతల్లి
ఎల్లలోకాల పరాశక్తి నీవెతల్లి
నాదు, కష్టాల్ని తీర్చి కాపాడుతల్లి

వ్యాసముని పలుకుల కంబ సంతసించి
అభయహస్తము జూపుతు ననియెనిట్లు
కోరుకొనుము- వ్యాసనీ కోరికేమి
తీర్చెదను నీవు జ్ఞానివినా, బిడ్డడవుకద

ధనకనక వస్తు వాహనాల నడుగకనె
భక్తునకు నీవిచ్చు నీశక్తి వరములివియె.
ఆదిపరాశక్తి వరాలిచ్చి ఆదుకొనవె
ఆత్మసంతృప్తి - మానసిక - శాంతినిమ్ము!

కరములను మోడ్చి- భక్తితో శిరము వంచు
వ్యాసముని కోర్కె-దీర్చి అంబ అదృశ్యమయ్యె.
ఆదిపరాశక్తి జగదాంబ - ఆదుకొనగ
మదిని గలయ శాంతియంతట బాసి చనియె

వ్యాస భగవానుడును- అంబ అనుగ్రహించ
అమ్మనే ఇమ్మహిని గొల్చు భక్తజనము
నిత్య సుఖ శాంతులనంది తరించగాను
దేవ దేవీ భాగవతమును భువిని నిల్పె

"సచ్చిదానంద రూపుడు" - శ్రీహరియనంగ
భాగవతమును వ్రాసిన వ్యాసముని,
"సచ్చిదానందమయి" - జగన్మాతయనగ
దేవ దేవీ భాగ వతమున తెలియ బలికె.

## దేవీ భాగవతం

సర్వసృష్టికి కారణ బీజమమ్మతల్లి
ఆదిశక్తి - పరాశక్తి - నాడు ప్రత్యక్షమవగ.
మధువు - కైటభదానవరాజువరులు
ఘోర, తపము చేసిరి వరాలనంద.

దేవతలు - అమృత పానము చేసినారు
దానవులకిది- ఏమాత్రము దక్కలేదు
యుద్ధమొనరించ- నిరువురు- సిద్ధపడగ
మరణమొకరిది, మనుగడ మరొకరిది.

మధువు కైటభు లిరువురు దానవులును
తపమొనర్చగ - నమ్మోరు - ప్రత్యక్షమయ్యె
దేవదేవి ముందట నిల్వ, తేరుకొనుచు
అడిగినారిట్లు - అంబను- కనికరించ

దేవదానవ యుద్ధాలు నిత్యములవి.
అసురులెల్లరు రణమున చచ్చిపడగ
సురలు చావకనుండెను చావులేక.
మరణమే మాకు లేదను వరమునిమ్ము.

తనయు లార మీకోరి కయసంభవమిల
జనన మరణాలు - తప్పవు జగతిలోన
మరణ మది ధృవంబైన మీకు వరము నిత్తు
మీరు కోరక మరణం- మీకు రాదు.

అనగ విని దానవ ద్వయం - సంతసించె
అంబ స్వేచ్ఛాన్విత మరణమనుగ్రహించి
అదృశ్యమయ్యె జగదాంబ అంతలోనె.
మధువు-కైటభులిరువురు ముదమునొందె.

మనము కోరనిదె మరణము మనకు లేదు
ఎవడురా విధాత! నెదిరించ వెడలినారు.
వీరినేగాంచి బ్రహ్మయు పారిపోయె
విష్ణులోకము జేరి విష్ణుకు విన్నవించ

బ్రహ్మ లోకము నేగ, బ్రహ్మను కానలేక
విష్ణు లోకమేగె, నెదుర్కొన, విష్ణువచట
నాల్గు భుజములవాడవు రణము సేయ
రమ్మనె తోడగొట్టి దానవులరిచినారు

నిన్ను చంపిన తదుపరి విధాత జచ్చు
మాదు భుజ బలశక్తి మహాద్భుతముకద
విర్రవీగిరి, దానవులిద్దరేకధాటి
మృత్యువే- వారినిలజూచి యునచ్చెరువడ

ఆది విరాట స్వరూపుడవ! ఏదిరమ్మ!
దాసుడవుకమ్మ- దండించి - వదలగలము.
మిడిసి పడుతున్న దానవులిరువురితో
తలపడెనునాడు- విష్ణువు రణము సేయ.

విష్ణుశక్తి- విష్ణుచక్రము- విష్ణుమాయ
అన్నియు వృధా- అంబశక్తిని- అడ్డుకొనగ
దానవుళతో పోరాడ- విష్ణువు శక్తిలేక
అలసిపోయె "యుద్ధవిరామ" మడిగినాడు.

యుద్ధమున విజేతలమని యుప్పొంగినారు
దాన,వద్వయం - యుద్ధ విరామ మొసగె
దానవుల జంపు మార్గము తనకు దెల్ప
విష్ణువును కైలా, సమేగె నీశ్వరునికడకు

ఈశ్వరుడు - విష్ణునిగని - ఇట్టులనియె
కేవలమాభువనేశ్వరీ దేవివలన
వారుజచ్చు మనకసాధ్యము చంపలేము
ఆదిమాత - ఆమ్మోరు-శరణమనివార్యమనె.

శరణు జొచ్చిన విష్ణుని కరుణజూచి
“అంబ” అమ్మోరు విష్ణువును అడిగెనిట్లు.
విష్ణుమాయను జయించ నెవరి తరము
అనుచు బలికిన “నీమాట” మరచినావ!

అనగవిని విష్ణువు “అమ్మ”నర్థించెనిట్లు:
ఆదిశక్తి-పరాశక్తివి- అర్థమయ్యేమాకు
నీదు, మాయను నిర్జించనెవరితరము
సకల సృష్టినీయధీనము సర్వమీవె.

దివ్యజ్యోతది నీదరినే నిత్యముండు
సంపదధికార సుఖశాంతి సాధనమది
నిత్యమీవు నీ బిడ్డలనిలుపగలవు
త్రిదశ జనయిత్రి మహేశ్వరి దిక్కునీవె.

అనగ, విని అంబ, సంతసించెయడుగమనెను
విష్ణువునె వరాలనిచ్చి రక్షింతుననగ.
మధువు కైటభులను జంపవలయు తల్లి
మువ్వురకు - త్రిమూర్తులకు, ముప్పువచ్చె

నాదు పుత్రులను చంపగ నాకు వశమ!
తల్లిపుత్రుల నెటనైనబరిమార్చగలద
నాదు,మాయాశక్తి- నిమిత్తకారణముగ
నిలుచును దునుమ దుర్మార్గత, వినుము విష్ణు.

గర్వమున విర్రవీగిన వాడు ర్పిలోన
జారిపడి- అధోగతిని-చేరు ననగ-
మధుకైటభులిరువురురిభయము తొలగ
శపింతు వారిని "మంచిచెడు" మరచినట్లు.

ఇంతకన్నను కావలసిందేమి తల్లి
వారి అహంకార దౌర్జన్యమే వారికి ఉరి
కుత్తుకను త్రెంచు సాధనంబంత వినగ
చంపు,దునునేను, లోకాల శాంతి కొరకు

అనగవిని అంబ, విష్ణువుతో -ననియెనిట్లు
ఎల్లరును తలొగ్గాలి విధి విలాసమునగ
దాట,గల దీని,ని ఏకైక, శక్తి నేనే
కార్య కారణ జగతిదని, యదృశ్యమయ్యె

యుద్ధ విరామము ముగియగ దానవులును
కబురు పంపిరి విష్ణువునకు కదలిరాగ.
మాత భువనేశ్వరిని మది తలచుకొనుచు
విష్ణువును యుద్ధ మొనరించ సిద్ధపడెను.

ఎన్ని దినములో యుద్ధము కొనసాగెనాడు
ఏ ఒకరు యుద్ధమున వెనకడుగు లేదు
శక్తిమాత వర, మిచ్చెననుచు నొకరు.
అంబ, భువనేశ్వరి కరుణ, కలదనుచు నొకరు

దానవ ద్వయం - దర్పమున- మత్తెక్కగాను
అంతరంగాన అమ్మశక్తిని-మరిచినారు
తమను మించిన వీరులెవ్వరనియరచినారు
మాయలోపడి "పరాశక్తిని" వదలినారు

"స్మృతిని" గోల్పోవ బుద్ధివి నాశనమగు
బుద్ధి నశియించ జీవుడు బద్ధుడగును
పరవ,శత్వము కలిగి - ప్రలోభపడగ
పట్టు తప్పు, పంచేంద్రియాలు! పతనమొకద!

మధువు కైటభుల పరిస్థితి సరిగనిదియె
"శక్తి" మాయా ప్రభావితులు- తప్పించవశమ!
మంచి, చెడు ఆలోచనా శక్తిని మరిచినారు
వల్లు మత్కెక్క - వగరు బోతులైరివారు

చూడు, విష్ణు నీ, తెలివెంత మోడుబారె
మరణ స్వేచ్ఛ మాకున్నది మరచినావ!
ఏల, నిష్కారణముగ అలసి పోయి.
హతుడు- వవుదువు- క్షమించితి- మడుగు- వరము.

నిన్నుజూచిన మా, కును జాలి మిన్నుముట్టె
కోరు, కొనుమే వరమైన నుతీర్చగలము
శత్రువునికైన - వరమిచ్చె ఘనుల మనగ
నిలుతు, మీ విశ్వము, న మేము వేల్పుల మన.

వరములిచ్చిన అమ్మను సరుకు గొనక
ఇతరులకు వరాల నివ్వగ ఎగిరి పడిరి
విష్ణు విది గ్రహించెనమ్మోరనుగ్రహామని
దాన వద్వయమును- వినగ - వరముకోరె.

మీతో యుద్ధమొనరించు మీ శత్రువునకు
మీరు వరము నిడపుడమి మెచ్చు కొనును
మాట తప్పొద్దని- విష్ణువు- పలికెనిట్లు
మీరు నాచేతిలో హతులయె వరము నిడుడు.

మాయలోపడ మంచి చెడులు మరుగునపడె
విష్ణునకు వరాలిచ్చెడి వీరులమని
నీచే మాకు మృతి సంభవ మిష్టమనెను.
జలము, లేని సమతలమున జంపమనుచు

దానవద్వయం, మీరీతి పలకనంత
మాత“వరం” స్వేచ్ఛా మరణం సంక్రమించె
వారు కోరిన మేరకే వారి మరణమనగ
దానవ ద్వయాన్ని విష్ణువు సంహరించె.

దానవులనిట్లు దునుమాడి హరియునాడు
విష్ణులోకము చేరె దేవతలే మెచ్చగాను
అంతలో యోగ మాయాతనని ఆవరించ
యోగనిద్రావస్థలో విష్ణువు ఒరిగి పోయె.

తెలిసి, కాని బ్రహ్మ విష్ణు లోకం బేగినాడు.
చేతనము లేక విష్ణువ చేతనుడవ-
బ్రహ్మ భయమంది చైతన్య శక్తి నివ్వ
ఆది శక్తిని మదిలోన- తలచినాడు

సర్వజగద్రక్షణి- సృష్టి కర్తనీవె
సర్వజీవుల చైతన్యపు శక్తి నీవు
సకల లోకాల శక్తుల సారమీవె
విష్ణువునకు శక్తి నొసగు "విధిని" నేను

ఇంతలో నీశ్వరుడును నిలచెనచట.
విష్ణుడ చేతనుడవ జూచి వింత పడుచు
భగవ, తీ మూలా, ంబిక శక్తిమాత- శరణు
విష్ణువును, వచ్చి- కావగ శివుడువేడె.

బ్రహ్మ- విష్ణు- మహేశ్వరులు- భక్తితోడ
ఎల్లరును ఆమె -నాది శక్తియనగనాడు
యోగ నిద్రలోన చేతనమైయున్న హరిని
అంబ ప్రత్యక్షమై విష్ణుని చైతన్యపరచె.

శర్వశక్తి ప్రదాత-హరి దైవమనుచు
భాగవతము తెలుపు-భక్త గణాలకెల్ల-
సర్వశక్తి ప్రదాయిని - తల్లి ఆదిశక్తి యని
దేవ, దేవీ భా,గవతము - తెలుపుమనకు

ఆది పురుషుడు - సృష్టి ప్రదాత-హరియని-
ఆదిమాత సృష్టి ప్రదాయిని - అమ్మోరని
ద్వివిధ - భాగవతాలలో తెలియపరచె
వ్యాసముని- ఋషి- మనవేద వ్యాసుదేను

ఆదిశక్తి, పరాశక్తి, అంబ- ఆదిమాత
విశ్వసించు, భక్తులకు-నెల్ల-నిచ్చు-సిరులు
సర్వశక్తి ప్రదాయిని అమ్మోరుతల్లి
శక్తిమయమీ - విశ్వ మాదిశక్తి మాత

ప్రతి శుక్రవారము భక్తితో- నమస్కరించి
నిన్ను స్మరించగ- నీ కథకు వినగ బలక
నిత్య ప్రార్థన లిడగను, భక్తజనము
నుడువగను-నేటి అమ్మోరు -పురాణమిదియె.

- సంపూర్ణం -

ప్రజాకవి-వంగపండు

పెందుర్తి